ఓం

మహాయోగిని

# భజనకీర్తనలు



మహాయోగిని భక్తసమాజము

పెనుమత్స - కృష్ణాజిల్లా.

ఓం

మ హా యో గి ని

# భజనకీర్తనలు

గ్రంథకర్తలు:

యార్లగడ్డ వెంకటసుబ్బమ్మ,
యార్లగడ్డ త్రిపురాంబ,

ప్రకటనకర్తలు:
మహాయోగిని భక్తసంఘము, పెనుమత్స,
గన్నవరంతాలూకా, కృష్ణాజిల్లా.

A

తొలికూర్పు : 1000 ప్రతులు

ముద్రణ :

లీలా ప్రెస్,

విజయవాడ.

1956

వెల రు : **0-6-0**

ఓమ్

# పీఠిక

చరాచరమైన యీ సృష్టిలో నాహార నిద్రాదులను సకలజంతువులకును సమానములు. పశుపక్ష్యాదులనుండి మానవుని పృథక్కరించునది జ్ఞానప్రదీపములు. అనేకశాస్త్రము లుండవచ్చును. వాని ప్రయోజనము వేఱు. అవి యైహిక సుఖసంధాయకములు మాత్రము. పాంచభౌతికమైన శరీరస్థితికి సుఖసంపాదకములు. ఇవి మానవుని సంస్కారదీప్తికి హేతువులు కాజాలవు. సంస్కార మాత్మసంబంధి. ఆత్మోన్నత్యమే మానవుని వారి నిర్దిష్టమైన గమ్యస్థానమునకుఁదీసికొనిపోవ సమర్థమైనది. వేఱువానివలన ప్రయోజనములేదు. ఈయాత్మోన్నత్యప్రయత్నమునకు దేహము ప్రధానోపకరణము. దీనిని నియమబద్ధముగా సంయమించవలెను. ఇదే యోగశాస్త్ర ప్రధానాంశము. దీని ప్రయోజన మంతటిది.

మనదేశమున నేవంవిధయోగవాసవాసితు లగు మహాత్ములకు లోటులేదు. ఎవరో యొకరు, ప్రాచీనకాలమునుండి యిప్పటివఱకును యోగ మభ్యసించి, పరమాత్మతత్త్వమును దర్శించి, సమ్యక్స్వం దేశములఁ బ్రజాహృదయములఁ బూతముఁజేయు మహాత్ము లవతరించుచున్నారు. అవతరింపనున్నారు. వారు కారణజన్ములు. జగత్కల్యాణము వారి సంకల్పమాత్రముననే జరుగును. తక్కినవారివలన నది సిద్ధించుననుకొనుట భ్రాంతి. వారు జీవన్ముక్తులు. ప్రస్తుతమున నాంధ్రదేశముకూడ తాదృశుల ప్రసవగౌరవమందినది. ఇద్దఱు ముగ్గుఱు తత్త్వద్రష్టలఁ గాంచినది. ఇటుఁ దత్త్వద్రష్ట లనఁగా యోగశాస్త్ర ప్రతిపాదితములైనవిషయముల ననుభవపూర్వకముగా దర్శించిన మహాత్ములని యర్థము. వారిలో నీమె ప్రధానస్థాన మాక్రమించినది. చిరకాలయోగాభ్యసపాటవమునఁ బరమేశ్వరస్వరూపమును దర్శించి ధన్యురాలయినది. కేవల భౌతికవాద బద్ధులైన వారినిగూడ తన యద్భుతచర్యల నాశ్చర్యముద్రితుల నొనరించునది. ఈమె జననము కృష్ణామండలమున పెనుమత్స గ్రామమునందు 1922 వ సంవత్సరములో. ఈమెగారి పూర్వనామము సీతమ్మగారు [ఈమెనుగుఱించి

యింకను సమగ్రముగా తెలుఁగఁగోరువారీమె జీవితచరిత్రను జూచుకొన వలయును] వీరు 1947 నుండి యోగాభ్యాసముఁ బ్రారంభించి, కొలఁది సంవత్సరములలోనే సిద్ధినందుదురు. ఈ మహాయోగిని యద్భుతచర్యల కనేకు లీమెకు భక్తులైరి. ఆమెయందలిభక్త్యావేశమునఁ బెక్కురు తన్మాహాత్మ్యమును గానముఁజేసి దేశివాఙ్మయము నలంకరింపఁగల కృతులఁజాల రచించి తమ జన్మముల ధన్యముఁ జేసికొనిరి. అట్టి కృతులలో నిదియొకటి. ఈ చిఱుపొత్తమునకు హేతుభూతమైన యావేశ మిరువురకుఁగలిగి వారిచే దీనిని రచింపఁజేసినది. వారినామములు యార్లగడ్డ వేంకటసుబ్బమ్మ, యార్లగడ్డ త్రిపురాంబ లని. వీరు చదువుకొన్నది స్వల్పము. ఇట మెచ్చుకొనవలసినది వారి భావప్రవాహము. దేశివాఙ్మయమందలి యొకశాఖకుఁ జెందిన యిట్టిగ్రంథములలోఁ జూడవలసినది వారి పాండిత్యము కాదు. దేశి కృతులు ప్రధానముగా గానయోగ్యములు. దీనియందా గుణము సమృద్ధిగా నున్నదనుట కా యోగినిగా రవతరించిన పెనుమత్సగ్రామములో దీనికిఁగల బహుళప్రచారమే తార్కాణము. దీనిని బ్రచురించుటలో సమ్యక్ప్రచారముఁ దీసుకొనివచ్చుటయే ప్రధానోద్దేశము. నేటికాలమున ననేకములైన గేయకృతులు వచ్చుచున్నవి. అవి ప్రయోజనదూరములు. ఇది తాదృశము కాదు. పరమతత్త్వమును దర్శించిన మహాత్మురాలి చర్యల నభివర్ణించు నీ చిఱుకృతి ప్రజాసామాన్యమున కుపాదేయమే యగును. దీనిని సహృదయ లాదరింతురుగాత!

వీరంకిలాకు
10-5-58

ఇట్లు,
తాడికొండ భోగమల్లికార్జునఅయ్యవారు.

ॐ

ఓం సద్గురుమాత

# మహాయోగిని భజనకీర్తనలు

## ఆత్మతత్వార్థరహస్యం

స్వామి సుజ్ఞానానంద విరచిత అఖండ బ్రహ్మాండంబను షడ్వికారరూపనామకము కల్పితంబను మాయాపట్టణం బొక్కటి కలదు. ఆ పట్టణంబును రేయింబవలనెడి సంకల్ప వికల్ప సింహాసనంబున కులాలయంత్రంబును చే ధరించి నిర్గుణ రామయ్య అఖండమండలంబును పరిపాలించుచుండెను. ఈ పట్టణమునకు వాసనాత్రయంబను మూడు ప్రాకారంబులతో దట్టముగా కోట కట్టబడియుండెను. ఈ ప్రాకారముల యందు ఈషణత్రయములనెడి మహాసేనయున్నది ఈ సేన ఉత్పత్తిస్థితియను 'ఈ ప్రపంచమునకు కావలియున్నారు. ఇచ్చుట తీసికొనుట నడచుకొనుట భజించుట స్మరించుట గ్రహించుట చూచుట వినుట అను క్రియలతో బ్రహ్మాండ వ్యాపకంబు నడచుచుందురు. పంచతన్మాత్రలను వీరవిక్రమ సింహ భటుల సైన్యము కోటయొక్క అన్నివైపుల సైన్యముల నడపుచు లోకంబుల క్షోభింపజేయుచుందురు. ఈ అంతఃకరణంబులను నల్వురుమంత్రులు ఈయిరవై లక్షల సైన్యంబును నడుపుచు లోకభయంకరంబగు కార్యముల చేయు

చుందురు. ఇట్టి మహాసేనలతోటిన్ని ఈ నలువురు మంత్రులతోటిన్ని రేయిం బవలనెడి ఈ జగత్తును పాలించుచుండెను. ఈ నిర్గుణ రామయ్యా తోడబుట్టువు సుధాదేవి. ఈమె పెనిమిటి జ్ఞానచక్రవర్తి. వీనికుమారుడు స్మృతివల్లభుడు. వీనిభార్య మేధ. మేధకుమార్తె రూపములేని చిన్నది. ఈ చిన్నది చాలాచక్కనిది, లోకములోని ధర్మాధర్మములను పరిశీలించునది. ఈమె పన్నెండు సంవత్సరములు నిత్యా నిత్యమను వేదవిద్య నభ్యసించెను. ఈమెకు యుక్తవయస్సు యేర్పడినందున తనకు వివాహముచేయ తనవారు నిశ్చయింప ఆమె చింతించి నేనడిగిన ప్రశ్నలకు ఉత్తరంబొసంగిన పురుషుని వివాహమాడెదను, లేకున్న నే నొల్లనని ఖండిత భీషణ వాక్యములతో పలికెను. ఆమె పల్కిన వాక్యంబులకు గడగడలాడి అమ్మా నీ కింత ఆయాసమేల? ఈ వంశవృక్షమున కాదిపురుషుడైన నిర్గుణ రామయ్యా. అతడు మిధ్యానగరమును పరిపాలించుచున్నవాడు. నీ వాతనియొద్దకుపోయిన నీకు సరియైన యేకైక భర్తను చూపగలడని తమబంధురాశి శ్రద్ధాభక్తితో విన్నవించిన, సంతసించి నిర్గుణరామయ్యవద్దకు బోవ నిశ్చయించి శృతి స్మృతి సూత్రాంగనలను ముప్వురి చెలికత్తెలతో మిధ్యానగరమునకు విహంగమార్గమున పోయిరి. ఆ పట్టణమునందు మహాసైనిక దళంబులు వీరి నాక్షేపించెను. రూపములేని చిన్నది. అకట వికట సమర్ధనపరు రాలగుటవలన వీక్షణములగు తన కటాక్షంబువలన నయిరి. క్రీగంటి చూపులవలన మహాసైనికులనందరిని మోహరాశిలో ముంచి

వైచి ధ్యానంబున మూడడుగులు పెట్టి క్షణములో నిర్గుణ రామయ్యవద్ద కేతెంచి వచించెను. ఓ అయ్యా యింద్ర మహేంద్రములతో కూడిన యీ మిథ్యాలోకం బేల సృజించితివి? దీనికి మూలకారణం బెవ్వడు? వా డేప్రాంతిలో నున్నాడు? నీ కెవ్వడు యీ యుద్యోగం బిచ్చె. ఆకారము లేనికుండలకు అతిమోహామున విభ్రాంతితో ఇట్లు పరిణమించుటకు హేతు వేమి? ఈ ప్రపంచమున గానుండుటకు కారణం బేమి? ఈ విషయము నెవ్వరిని అడిగిన సవిస్తారముగ చెప్పగలరన, నతఁడు యేరాజ్యమును పరిపాలన చేయువాడు వాని స్థితిగతు లేమి? వాడు స్థితప్రజ్ఞుడా? ఈ కూటస్థుడా? చిదభ్యాసుడా? వాడ యొక్రియనున్నాడు! వానివద్దకు ఎట్లు పోవలెను? ఈ విషయం బేమి యని కరకళిత కరముకుళిత వదనారవింద హాస మంజుల వాగ్విలాస మధురమాధుర్య వాక్కులతో ప్రశ్నింప జగత్సర్వ పాలకుడు నిర్గుణ రామయ్య రూపములేని చిన్నదాని వాక్యముల కాశ్చర్యపడి బ్రహ్మాది వేత్తల కలవిగాని నిత్య సత్య తత్వార్థ రహస్యంబు నడిగితివి. నీ బుద్ధిపటుత్వంబు ని న్నుద్ధరించును. నీ వవశక్యంబున అతనివద్దకు పొమ్మని చెప్పగా ఆమె సంతసించి సాష్టాంగ నమస్కారములు చేసి మహానుభావ ధన్యురాలను ధన్యురా లనేకవిధంబుల ప్రార్థించి నిత్యసత్య కైవల్య పట్టణంబునకు బోవ ప్రయత్నించెను. పరిపూర్ణంబను బాటలో హాయియను శృంగారవనమధ్యంబులో శాంతియనెడు చీరగట్టి వికలంబనే రవికతొడిగి సత్యమనే

పుష్పము కొప్పున ముడిచి జ్ఞానమనెడి బొట్టుపెట్టి దయయనే గాజులుదొడిగి పరోపకారం బను కమ్మలు ధరియించి రామరా మయనుచును రత్నహారంబు కంఠమున ధరించి భక్తియనేవడ్డా ణంనడుంకుబెట్టి షట్క్రియయను కాలికందెలువేసి జైజైయను చేతులు జోడించి వైరాగ్యంబను వాహనమెక్కి యెరుకయను జాతీయత జ్ఞాతృజ్ఞానంబుల దండించే జ్ఞేయముసేయుచును సుజ్ఞానానందసూత్రంబుగాంచి జాగ్రతగిరి స్వప్నగిరిసుషుప్తులను మూడుపట్టణములను ఓం అని కేకవేసి ఓ అని లంఘించి కుం భించి కుప్పించి ఉప్పరమార్గంబున కెగసి త్రిపురంబును దాటి త్రిపుటి కవ్వల నిలచి సదాశివుని జూచి షడాధారముల పూజించి వేదము నవ్వులుచు వేదవాక్కు వెదజల్లి బ్రహ్మరంధ్ర మునబోయి విరాటస్వరూపమును జెంది నిత్యసత్య కైవల్య పట్టణముజేరి నిరంజనమహారాజును జూచి నమస్కరించెను. ఆ రూపములేని చిన్నదాని సౌందర్యమునకు సంతసించి నిర్గుణ రామయ్య పంపగా వచ్చినదియే యని సంతసించి ఆమెను జననమరణము లను బొట్టుపెట్టి దశవిధములనెడి వాద్యము లాలించి కళాబిందువుల హారతెత్తి నిష్కామయనెడు హారము మెడనువేసి సుఖియను బ్రహ్మానంద శయ్యపై శయనించు ష్పేషంజను క్రీడవొంచి శాశ్వితంబను నుయ్యాలతో యోక మోకంబని అఖండపరిపూర్ణంబునుపొందిరి. ఈ ఆత్మ తత్వార్థ రహస్యంబును ఎరిగిన వారికి సకలతత్వోపరహాస్యము లిందు

న్నవి. భక్తి శ్రద్ధలతో ఎవరు చదివినను విన్నను పరమ హంస మార్గంబు జేరగలరు.

సుజ్ఞానానంద మహాయోగి వాక్యములు వినవలసినది.
తత్సత్ బ్రహ్మార్పణమస్తు.
ఆత్మతత్వార్థ రహస్యము సమాప్తము.
ఓం శాంతిః శాంతిః శాంతిః.

కీర్తన.

చిన్ని యోగి ముద్దులయోగి వచ్చిదేవామాయింటికీ నీవొచ్చెదవా మాయింటికీ నీపాదదాసులు మొరవినివచ్చెదవా మా యింటికీ ॥చి॥ నాపాలిదైవము నీపాదపూజజేసితిని నిరతము నీదివ్యనామమే మరువనె తల్లి ॥చి॥ కలలోన యిలలోన నీనామస్మరణ జేసితిని. ఈ దాసురాలిని మోసముచేయక నీచెంతజేర్చుకోతల్లీ ॥చి॥ నీపాదపూజజేసినందులకూ ఇచ్చితివా మోక్షపదవి కడతేరెనాజన్మ నాభాగ్యమె సౌభాగ్యం నీపాదదాసులపైకరుణకల్గిన తల్లి నాభాగ్యమె సౌభాగ్యం॥చి॥

మ ం గ ళ హా ర తి.

నిరాకారనిరంజనా నీకు హారతి మహాయోగితల్లి నీకు మనసుహారతీ ॥నీ॥ పంచభూతములైదు ప్రమిదగాను జేసినాను మించిపోమె గుణములన్ని వంచివత్తిజేసినాను ॥ని॥ తామసమనే గుణముతీసి తరచి చమురు బోసినాను అహంకారమనేగుణము నక్షితలుగా వేసినాను ॥ని॥ కామక్రోధములు త్తివెలిగించినాను దూషణమనే గుణముదీసి ధూప

ముగా వేసినాను ॥ని॥ మాయయనే తెరనుదీసి మల్లెపువ్వులు బెట్టినాను ఇచ్ఛయనే గుణముదీసి దక్షిణగాబెట్టినాను ॥ని॥ పెనుమత్సపురనివాస ప్రేమహారతి దాసురాల హృదయ నివాస ధామ హారతీ ॥ని॥

మంగళహారతి.

హారతిదేలందుకొమ్మా ఆదరముగామహాయోగి నీరసముగా జూడకమ్మా నీవె మాకాధారమమ్మ ॥హా॥ ఘోరసంసారాబ్ధినుండి గొబ్బునదరిజేర్చవమ్మా ॥హా॥ పాపభూయిష్టమైన పాడుజగమునుజూచి వెంటనే యోగాభ్యాసమును వరించినతల్లివి ॥హా॥ వెంటనే మానిరూపంబుదాల్చి దాసుల రక్షించఇంటఇంట వెలసి వారియీప్సితములు తీర్చినతల్లి ॥హా॥ అమ్మ నీదుమహిమలెన్న హరహరాదుల కలవిగాదు సమ్మతముతో దాసురాలను సాకినమహాయోగి తల్లీ ॥హా॥ చక్కర నారికేళము ఆరగించుముతల్లీ ఆరగించి దాసుల ఆదరించు మహాయోగి ॥హా॥ పెనుమత్స ప్రముఖుడైన దేశికేంద్రు గురునకూ ధ్యానమరువని దాసురాలుధ్యానగురునకూ ॥హా॥

మంగళహారతి.

హారతీ మంగళహారతీ మహాయోగి గురునకూ హారతీ మంగళహారతీ ॥హా॥ పంచభూతంబులనెంచి పళ్ళెముగాను జేసి గుణమునొక్కటి కుందెచేసి మానసంబను వత్తిచేసి కామక్రోధము చమురబోసి కారణంబున హారతిచ్చితి ॥హా॥ యింద్రియాదులు పూలుగోసి దుర్గుణంబులు ధూపవే

గుణములు హారతికర్పూరముచు జేసి ॥హా॥ వామభాగము పూజచేసి వందనంబున హారతిచ్చి మూలమేము తెలిసికొం దును ముక్తికాంతకు నేడు జయహారతి ॥హా॥ ఆనందం బరటి పండ్లు సత్వగుణము నారికేళము నైవేద్యము చిద్విలాసం బాకువక్కలు చిన్మహేసుకు జయహారతి ॥హా॥ పుణ్య బలము గంధమక్షతలుజేసి మానసంబున పూజజేసి ఓంకారము శంఖ నాదము హృన్మహేశుకు ॥హా॥ నిశ్చయంబుగ నిర్గుణంబున ఆత్మ వైరాగ్యము దెల్పినట్టి యవ్యయానందముతోను వెలుగు చున్న మహాయోగి గురునకు ॥హా॥

## మేలుకొలుపు

మిశ్రగతి—భూపాలరాగము

మేలుకొనుమా మేలుకొనుమా పరమయోగి మేలు కొనుమా, మేలుకొనుమా వైరాగితల్లి మేలుకొనుమా॥ హంసతూలికాతల్పమున హాయిగా బవళించినావా నీదుభక్త వరులెల్ల లేచియున్నారుగతల్లీ మేలుకొనుమా ॥మే॥ ముక్తి కాంతనుగూడి మురియుచుంటి వేమొగాని నాదు మొర లాలకించి తల్లీ మేలుకొనుమా ॥మే॥ త్రివేణి సంగమందున స్నానమాడుచుంటివేమొ మానససరోవరములో తల్లీ మేలు కొనుమా మహాయోగి మేలుకొనుమా ॥మే॥ మోక్షమహాత్మ కాంతమణిని గూడి దీక్షతో నీవుంటివేమొ దీనులరక్షించ తల్లీ మేలుకొనుమా ॥మ-మే॥ ఈడపింగళ జతనుగూడి జోడు బాయక యుంటివేమొ పక్షిజాడ పట్టినాము తల్లి మేలుకొ నుమా ॥మ-మే॥ మేలుకొనుమా మేలుకొనుమా రాజయోగి

మేలుకొనుమా మేలుకొనుమా మేలుకొనుమా పరమయోగి మేలుకొనుమా పొందుగా భ్రూమధ్యమందున శృంగాటక వీధిలోన నడినాళమునందు యోగనిద్ర మేలుకొనుమా ॥మే॥ సోహంమే ఆధారమనుచు సారది జీవులకెల్ల తల్లీ నీవె బ్రహ్మం బనుచు స్థిరముగ తెల్పిన తల్లి మేలుకొనుమా ॥మే॥ నిర్వి కల్పంబునందున నిండియుండెను నీమహిమ నీకు సంజ్ఞ కన్నవారలు నీ భజన సేతురమ్మా మేలుకొనుమా ॥మే॥ శ్వాసయనే నూలుబట్టి చక్రగా నాడించినావు మనసే మర్కటంబని మరిమరి తెల్పినతల్లి మేలుకొనుమా ॥మ-మే॥ పెనుమత్స పురవరంబున ప్రేమతో వెలసినందుకు తల్లి దాసుల దరిజేర్చ మేలుకొనుమా నీశిష్యుల దరిజేర్చ మేలు కొనుమా ॥మ-మే॥ విధము తెలిసిన మహాయోగి శిష్యులను గూడుకొని సుబ్బమాంబ గురుతుమానకవచ్చె మేలుకొ నుమా ॥మ-మే॥

## గురుప్రార్థన

గురుదేవా మముబ్రోవ నిరతముతోడై రానా కరుణను మదిగనలేవా పరమదయావారి రావే దేవా రయముననిక జయ మొసగున్ ॥గు॥ యీ జగమేస్థిరమనుకొని ఇహ సౌఖ్యం బులలోబడి వేసరి నీశరణంటిని విడువకు మిక తల్లి రావే దేవా రయమున నిక జయమొసగున్ ॥గు॥ ఆత్మపదములునే యీ శిరమునవే దాల్చెదనూ కనుమూసిన కనుదెరచిన కనుపిం చుము తల్లీ రావే దేవా రయమున నిక జయమొసగున్ ॥గు॥ జననము మరణములేనీ ఘనపదవిని మాకొసగుము కనుమూ

సిన కనుదెరచిన కనుపించుము త ల్లి రావే దేవా రయమున నిక జయ మొసగున్ ॥గు॥ మూడీషణములు బాసి మూడు గుణంబులు బాసీ ఏడవభువిలో నిక నిల్వగ జేయుమయ్యా రావే దేవా రయమున నిక జయ మొసగున్ ॥గు॥ పరిపూర్ణంబై ఘనమైన పరబ్రహ్మానందంబై బాగగు మీ స్వస్వరూపంబును భవముగ జేయుము మా రావే దేవా రయమున నిక జయ మొసగున్ ॥గు॥ సకల చరాచరంబులు నీవెయున్ నిండిన బ్రహ్మాండరూపా రావే దేవా రయమున నిక జయ మొసగున్ ॥గు॥ నిన్నె నమ్మినాము మమ్ముల బ్రోవవ నాతల్లి కన్నతల్లివనుచును కరుణతో వేడుచుంటిని కరుణించి మమ్ములను కడతేర్చుము నాతల్లి రావే దేవా రయమున నిక జయ మొసగున్ ॥గు॥ వేదాంతవేద్యుడవు ఆద్యంత రహితుడవు రావా మములను కరుణింపవా నా తల్లి కడతేర్చుము నాతల్లి రావే దేవా రయమున నిక జయ మొసగున్ ॥గు॥ గోవర్ధన గిరి మెత్తిన గోకులగోపాలా రారాకృష్ణా నీమురళి వాయించుము నాతండ్రి ఆనందవార్ధిలో ముంచి తేర్చుము నాతల్లి రావే దేవా రయమున నిక జయ మొసగున్ ॥గు॥ గోపాల చిన్నికృష్ణా రారా యశోదతనయా నీమహిమలు గనుగొన నెవరి వశమురా రావా నాతల్లి మమ్ములను కడతేర్చుము నా తల్లి రావే దేవా రయమున నిక జయ మొసగున్ ॥గు॥

## పూ జ పా ట.

రావో శ్రీమహాయోగితల్లి వైరాగితల్లి నీపాదపద్మభక్తులూ కోరిపూజింతు మందారపూలతో ॥రా॥ నీపాదభక్తులు వేడగా

కరణించరావా వైరాగి నీపాదపద్మభక్తులు కోరి పూజింతు గులాబిపూలతో ॥రా॥ భక్తులనాదరించగా వచ్చితివా యేకాదశినాడు నీపాదపేదభక్తులూ కోరిపూజింతు సంపెంగ పూలతో ॥రా॥ ఆనందమిచ్చే నీలీలలూ భక్తితో గొలుతూ నీనామమూ నీపేదపాదభక్తులూ కోరిపూజింతు గన్నేరు పూలతో ॥రా॥ నీకృపతో నే నొచ్చితి నీ దర్శనమీయన మహాయోగి నీపాదపేదభక్తులూ కోరిపూజింతుమల్లెపూలతో ॥రా॥ నిర్వికల్పసమాధిలో నిలచితివా మహావైరాగి నీపాద పేదభక్తులూ కోరిపూజింతు తులసిదళముతో ॥రా॥ విష్ణు లోకముచుండి వచ్చితివా భూలోకము పాలించితివా నీపాద పేదభక్తులూ కోరి పూజింతు సన్నజాజుపూలతో ॥రా॥ చిక్కనశల్యములతోడనూ దర్శనమిచ్చిన మహాయోగి నీపాద పేదభక్తులూ కోరిపూజింతు మంకెనపూలతో ॥రా॥ అమృత ధారలు కురిపిస్తిరి. ఆనందలీలలు మెరపిస్తిరి నీపాదభక్తుల దీవిస్తిరి చేరిసేవింతు చామంతిపూలతో ॥రా॥ శ్రీమహాయోగి శిష్యులము కరుణింపరావా వైరాగి సుబ్బమాంబ నిను వేడుచు చేరిసేవింతు పారిజాతపూలతో ॥రా॥

## కీర్తన.

దణ్ణముదణ్ణముదణ్ణము నీకు దణ్ణము మహాయోగిదణ్ణము బెట్టెద దర్శనమిచ్చి దారిజూపి కడతేర్చనమ్మా ॥ద॥ ఎన్ని విధంబుల వేడినగాని సుంతయు నీదయరాదుగదా పంతము నాపై తల్లీ నీకు ఎంతవాసనని పంతమమ్మా ॥ద॥ ఎక్కడ వున్నాడని భగవంతుడు పరుగుపరుగున పరుగెత్తరయ్యా

తనహృదయములో తానేజూచితే తనసుతానైయుండెనయ్యా ॥ద॥ కలలోనైనా నీనామము నెప్పుడు నిన్నే దలచుచునుంటి నమ్మా నిశ్చలమైన చిత్తముతో నే నిను మది ధ్యానించు చుంటినమ్మ ॥ద॥ నిమిషంబైన నిన్నెడబాయక నిన్నే దలచు చుంటినమ్మా నీవే నేనై నేనే నీవై ఆనందముతో నుంటి నమ్మా ॥ద॥ దోసిలోనదాసాజనులకు దోషములేదని యంటి నమ్మా దాసాదాసా పెనుమత్సవాసా దాసులమని మేనుంటి మమ్మా ॥ద॥

కీర్తన

భామామణులారా మీరు పైనమై రారే ప్రేమమీర పెనుమత్స మహాయోగిని జూతాము పొందుగా క్రిష్ణాకాలువ స్నాన మబ్బునే మేలైన ప్రాసాదములు మెక్కవచ్చునే ॥ భా॥ సురలుమెచ్చి జూడగా కిన్నెరలు మ్రోయగా గురుతుగా మహాయోగివచ్చి కూర్చున్నదిగా ॥భా॥ జ్యేష్ఠశుద్ధ ఏకాదశి నాడు చిత్రతరముగా మహాయోగివచ్చెనూ భక్తులుజూడగా ॥భా॥ కనులపండువగాను గాంచవచ్చునే హరిభక్తులంతా గూడి పాడగవచ్చునే ॥భా॥ కూరిమితోడ పెనుమత్సపుర నివాసులే హరికి మహాయోగివద్ద కేగవారైనారే ॥భా॥

కీర్తన

జోహారు జోహారు మహాయోగి ఆంధ్రవేదయువతు లకు జ్యోతివైనావా ॥జో॥ పేరుకని అనసూయ అందురే మొ గాని అనసూయ నీమెరుట ఎంతదోయమ్మ ఆనాడుఅనసూయ అత్రిమునితోగూడి ఆశ్రమములోనుండెనేమొగాని ఏతోడులే

కను ఇంటిలోపలతల్లి ఆకులలములుగాని అన్నంబుగాని ఆరగించకతల్లి జ్యోతివైనావా ॥జో॥ ఉన్నారు మనలోన శూర్పణఖలంటారు కడునిందలుజేయుటకు తల్లీ నిందలుబాపియుసమాధిలోనుండి జ్యోతివై నిలచావా శ్రీమహాయోగి ॥జో॥ పంతమునకు సావిత్రిఅందు రేమొగాని పట్టిజూడ సావిత్రియెంతదోయెన్ను భర్తకై సావిత్రి పట్టినదేమోగాని ప్రపంచమునకు మహాయోగి జ్యోతివై నిలచింది ॥జో॥ నిత్యానిత్యవివేకము తెలిసికొని విష్ణుమహేశ్వరుల సేవలము జేసుకొన్న దిక్కులేనక దీనులు వేడగా సమాధినుండివచ్చి దీనులరక్షించ వచ్చినావాతల్లీ జ్యోతివైనావా ॥జో॥ శోకించకే ఆంధ్రమాత నీవు మహాయోగియు జూపించెనేదారిప్రతిపల్లెయందును ప్రతియింటియందును ప్రతివారు నీపూజ జేతురమ్మా తల్లీ ॥జో॥ పెనుమత్సనగరములో వెలసినందుకు తల్లీ ప్రేమతో ఆంధ్రులంతా కూడుకొని ఆనందముతోడనూ ఐక్యమొందియుమహాయోగి దీక్షకు సాగిరావాలి ॥జో॥

## కీర్తన

మహాయోగి మహాయోగి మానోములెల్లపండినావి మహాయోగి రాకాసిమూకలు మహాయోగి బహుచికాకు జేస్తుంటె సదాయోగి శంఖుచక్రాలేసి మహాయోగి శెలవిచ్చి పంపినారా సదాయోగి ॥మ॥ ముల్లుముతిక జూచుకుంటా మహాయోగి నీవు మెల్లగొచ్చినావా సదాయోగి ॥మ॥ ఏకైక మనసుతో మహాయోగి నీవు యోగివై వచ్చినావా సదాయోగి ॥మ॥ వచ్చికూర్చుంటేను మహాయోగి నిన్ను

వరము లడిగినామా సదా యోగి ॥మ॥ మాట్లాడమన్నారు మహా యోగి నిను మాన్యంబు లడిగినామ సదా యోగి ॥మ॥ బుద్ధులు చెప్పమంటిమి మహా యోగి భూషణంబు లడిగినామ సదా యోగి ॥మ॥ మాట్లాడకపోతేను మాకేమిగాని వారాని కొకసారి మహా యోగి నీవు నిమిషాని కొకసారి సదా యోగి జీనసమాదంటే మహా యోగి బహుచింతాన జేస్తాము సదా యోగి ॥మ॥ నీవు నే నేకమైతే మహా యోగి మాకు చింతేమి లేదుగా సదా యోగి ॥మ॥ పెనుమత్స పురములో మహా యోగి నీవు చెరుకూరివారి గృహమందు సదా యోగి శ్రీ రామమ్మ బ్రహ్మయ్య దంపతుల గృహమందు మహా యోగి నీవు జనన మొందినావమ్మ సదా యోగి జనన మొందినావమ్మ మహా యోగి మాజన్మ సార్థకము జేయుమమ్మ సదా యోగి ॥మ॥

కీ ర్త న

ఎంతి పేదదానవమ్మ మహా యోగీశ్వరి మహా యోగీశ్వరీ సదా యోగీశ్వరీ ॥ఎ॥ ఉండుటకు నీ కిల్లు లేదా వెండి కొండదేహమా ఎండికొండదేహమా ఏమినీకుకొదువలే ॥ఎ॥ కట్టవస్త్రమైనలేద కలికిపురుష నీకులే మానాభిమానాలు మాడ్చివేసినావులే ॥ఎ॥ పూయ గంధమైనలేదు పుణ్యాపురుష నీకులే నీపూర్వపుణ్యమున నీవె గంధమైతివి ॥ఎ॥ శిరమున పడగయు కరమున చక్రము కదలక మెదలక వచ్చియున్నావులే ॥ఎ॥ నీపాదసేవ మాకు ఇవ్వవమ్మ ఓతల్లి నీపాదసేవ మాకు చాలునమ్మ ఓతల్లి ॥ఎ॥ దత్తపుత్రి బ్రహ్మపుత్రి దయయుంచు మామీద దయయుంచి మామీద దర్శనమీయవమ్మ ॥ఎ॥

పెనుమత్సపురములో వెలసియున్నావులే వెలసి వేల జనుల రప్పించినావులే ॥ఎ॥

ప ద్య ము

దిక్కులు పిటారి తారలోకముగప్ప ప్రళయవాయువు సుడుల్ బుట్టవచ్చు, హంసేందుతారలు ఆకసం బిడనాడి పుడమిపై నొకవేళ కూలవచ్చు, బ్రహ్మాండమంతయు బడబాగ్ని చేతను మచ్చులేకను మంటమండవచ్చు, సురరాజుతోడను సురలోకమంతయు పోవచ్చు నొక వేళ పోల్కిలేక, బ్రహ్మ మతి పోయిసృష్టిని మానవచ్చు, శివుడు అగ్నినిజల్లార జేయవచ్చు, నాదు దైవమైనమహా యోగి, చేటులేకుండనను జేర్చుమోక్ష పురము॥

ప ద్య ము

ఇనకులదీప యదువంశమునందు కృష్ణదీప ఈ జనులకు మార్గదీప భవచీకటి బాప జ్ఞానదీప ఆ మునులకు నాత్మదీప ఈ జగమునకు భానుదీప నామనమున దివ్యదీప పరబ్రహ్మజ్యోతిపీ మహా యోగినీ॥

కీ ర్త న.

మహా యోగి నీదివ్య నామమెప్పుడు దలతు ఓ తల్లి మము బ్రోవ రావదేమితల్లి శ్రీకామజనని మమ్ము గాపాడరావేమి నీమముతో నిన్ను నమ్మితినీ తల్లి ॥మ॥ పాలముంచినగాని నీట ముంచినగాని భారము నీదని యంటినమ్మ తల్లి ॥మ॥ పెనుమత్స పురనివాస మహా యోగితల్లి భాసురముగ నీదు భజన జేతునమ్మ ॥మ॥ ధరలోన పెనుమత్సదాసులతల్లి బ్రోవుమి దాసుల పావని తల్లి ॥మ॥

## కీర్తన

ఏమమ్మ మహాయోగి ఎన్నటికి దయరాదు భారమాయెనా నీకు బంధనంబులు బాప ॥ఏ॥ ఘోరసంసారంబు నేరీతిదాటుదు దారి తెలియదాయె దారిజూప రావ ॥ఏ॥ ఎంతని వేడుదు పంతమా నన్ను బ్రోవ సుంతైనకృపలేదె అంతరంగమునను ॥ఏ॥ కామాది శత్రువుల ఖండించుత కడువేగ వైరాగ్యపదమొసగుతల్లి ॥ఏ॥ నీకరుణలేకున్న నిలుప జాలనుతల్లి నిత్యానందమొసగు నిను గొల్తు మహాయోగి ॥ఏ॥ హృదయనివాస నామదిలోనయుండేటి మలినంబులన్నియు నూడ్చివేయుము తల్లి ॥ఏ॥ సర్వాంతర్యామి యోసర్వకళాతీత పెనుమత్సవాస నానద్దన నిల్వవా ॥ఏ॥

## కీర్తన.

మహాయోగికన్న దైవ మెవరూ ఎరుక తెలిసినవారికి మోక్షలేకను ఎరుక తెలియకదైవము నెట్లు కనవగునా ॥మ॥ పూర్ణయ్యగారి బోధగురుచే పరిపూర్ణమాయె మహాయోగి అప్పయ్యగారి బోధగురుచే పరమాత్మ తా నాయె ॥మ॥ జ్యేష్ఠ శుద్ధ యేకాదశి నాడు, శనివారము ఆరుగంటలను అజ్ఞానము బాపుటకు అరుణోదయం బాయెను సుజ్ఞానము దెల్పుటకు సూర్యోదయం బాయెను ॥మ॥ శిరమున పడగయు కరమున చక్రముతో మానిరూపము దాల్చి దిగంబరై వచ్చెనూ ॥మ॥ చెంతనే తల్లియు తండ్రియు కొల్వగా శేషమ్మ సపర్యలు చేయుచుండగా మహాభక్తులకు మహిమలు జూపించె ॥మ॥ మౌనంబులోనుండియు మహాభక్తులకునూ కాలజ్ఞానంబు వ్రాసి కడతేర్చె మహాయోగి ॥మ॥

పెనుమత్స పురనివాస భక్తుల బ్రోచుటకూ పరమాత్మ తానై ప్రపంచమునకూ వచ్చెనూ ॥ను॥

## కీర్తన.

ఏమిచేయుదు మహాయోగి దైవమా నా కెటులం దోచ దాయెనూ గట్టిగా సంసారంబు పట్టి బాధించుచున్న నీ కామాది శత్రువుల ఖండించుదామనుకొంటెను కడు వేగ వైరాగ్య ఖడ్గమే దొఱకదూ ॥యే॥ ఆశయను పాశమును కోసివేయుదా మనుకొంటెనూ కోర్కెయను మనసు నన్ను కోపగించుచున్నదీ ॥ఏ॥ పూరక రేచకాదుల బంధించుదామను కొంటెనూ శాంతమనే గుణము లేక శ్రమపడుచునుంటినీ ॥ఏ॥ శ్వాస నిశ్వాసలను బంధించుదామనుకొంటెనూ భారమాయె నాకు ఎంతో ఖర్మమేమొ తెలియకను ॥యే॥ జీవాత్మ పరమాత్మను ఐక్యము జేదామంటెనూ అందు దారిగానక తల్లడిల్లుచుంటినీ ॥యే॥ పెనుమత్సమహాయోగిదైవమా ప్రేమతో నన్నాదరించి దరిజేర్చుకొనవమ్మా దాసురాలను నీవు॥యే॥

## 15. కీర్తన

చక్కనిమహాయోగితల్లి మొర్రక్కదాదిక్కునీ వేయనుచు వేడితీ గ్రక్కున మోక్షమివ్వుము కనులెత్తిజూడవేమి పంతమేల నామీద కుక్షిలో బ్రహ్మాండమంత నిండినతల్లివి ॥చ॥ మహాయోగముచేత మాయనెల్ల విడగొట్టినావు బీదసాధకులకూ జ్ఞానామృతం బొసగినావు ॥చ॥ మౌనము దాల్చియు మహాభక్తులకూ కాలజ్ఞానంబు వ్రాసికడ తేర్చినావు తల్లి ॥చ॥

ధరణిలోనూ దాసురాలి నేలుటకునూ జాలమేల జేసేవు మహాయోగి తల్లీ ॥చ॥

కీ ర్త న

వచ్చెను మహాయోగి వచ్చెనిదిగో మమ్మేలె మహా యోగివచ్చెనిదిగో మమ్మురక్షించే కారణకర్తయూ వచ్చె సదాయోగి వచ్చెనదిగో ॥వ॥ నదులకు నిధులకు నాటకధారి మేటిరపుంబున ఆటలాడెడి తల్లీ వచ్చెనదిగో ॥వ॥ చిన్న పిల్లలు శిశుబాలురు గూడి బజారులంబడి భజనలు సలుప ॥వ॥ చుట్టుజడలు తాపసి గురువాక్య నిరాకారమై నిరంజనమై చరాచరములు నిండినయోగి ॥వ॥ పంచకషాయుంబులు పలహా రంబులు మించిన మంగళహారతులీయగ ॥వ॥

కీ ర్త న.

అదిగో చూడండీ మహాయోగి అదిగో చూడండి సదాయోగి అదిగోచూడండి తారవలెకూర్చున్నది అదిగో చూడండి ॥అ॥ చెంతనే జననీజనకులు కొల్వగా శేషమ్మ సపర్య జేయుచునుండగా ॥అ॥ పక్కనే పరమాత్మునిగూడుక భక్తులకూ బోధ సల్పుచు నున్నదీ ॥అ॥ పెనుమత్సపుర మందూ భక్తులహృదయమందూ స్థిరముగాయున్నాదీ శ్రీమహాయోగి ॥అ॥

కీ ర్త న.

మహాయోగి మహాయోగి అని నే నామముబాడ ట నావంతు హరిబిడ్డా ఏకశిలోలా యని సంరక్షణజేయుట నా

వంతు సిధారుపైబడి సాష్టాంగనమస్కారముజేయుట నా
వంతు బంగారంబున రావెపుత్రియని కౌగిటజేర్చుట నీవంతు
॥మ॥ చిన్నితాళములు చేతులబట్టుక తప్పటుగొట్టుట నా
వంతు మరలికబాపుచు వాత్సల్యంబున మమతహించుట నీ
వంతు మ॥ నీశైకైకృతులను నిర్మలమతినై నేర్పునగూర్చుట
నావంతు నీకేల్చాచుచు వానినిగైకొని పాలనజేయుట నీ
వంతు ॥మ॥ గగ్గురుపడుచూ గాథావళి గానముజేయుట నా
వంతు ఎగ్గుదలంచక ఎంతోప్రీతిని ఇంపుగబ్రోచుట నీవంతు
॥మ॥ చేతులు నొచ్చగ నీపాదములకు సేవలుజేయుట నా
వంతు నీ వాలించుచు వానిని గైకొని లాలలుబాడుట నీ
వంతు ॥మ॥ లక్ష్మీపార్వతియనుచు రయముగ బాడుట నా
వంతు పెనుమత్స దాసురాలను ప్రేమతో బ్రోచుటనీవంతు॥మ॥

కీర్తన.

మహాయోగి నిన్ భజియించితిన్ పరమాత్మ నీవనుచు భావించితిన్ భక్తులహృదయ నిన్ను పూజించితిన్ దాసుల దొవరని కోరినమ్మితిన్ ॥మ॥ ఆదిదేవ నిన్నాశ్రయించితిన్ శ్రీలక్ష్మీపార్వతీ మదినమ్మితిన్ వేదాంతవేద్య నిన్ను వేడు చుంటిని సాధుహృదయానంద చాలనమ్మితిన్ ॥మ॥ మహాయోగి నీచరణద్వయికని సేవగోరి సన్నిధికి చేరియుంటినీ పగబూన న్యాయమా మహాయోగి పదములేగతియని ప్రార్థించితిన్ ॥మ॥ విన్నవించితిన్ మహాయోగి నీ కన్న దిక్కెవరు కల్లరంటినీ చిన్నారియోగినీ చెంత జేరితిన్ కన్నతల్లి నీవు నన్ను కావుమంటినీ ॥మ॥ వాసిగాను యీ పెనుమత్సలో

మహా యోగి నిన్ను నాశ్రయించితిన్ దాసుల కభయమిచ్చే దైవమంటినీ దరిజేరి నీకు నే దండమంటినీ ॥మ॥

కీ ర్త న

మహా యోగి మహా యోగి వేగ బ్రోవవా కఠినమును మాని నీ కనులజూడవా ॥మ॥ అఖిలాండరూప నన్నాదరించవా నిఖిలలోకరక్షకా నిను నమ్మియుంటినీ ॥మ॥ ప్రణతగానలోల నీపాలబడితినీ వినతిజేయజాలనే పాపమతినీ ॥మ॥ పాపరహిత మహా యోగి దాపుజేరితినీ కోపమేల సదా యోగి కోర్కెదీర్చవా ॥మ॥ యింతపంతమేల శ్రీకాంత లోల అంతరంగమందునున్న వంత మాన్పవా ॥మ॥ భక్తపరాధీన నీపాదమె నమ్మితినీ శక్తిలేనివాననై నీచెంత జేరితినీ ॥మ॥ అందమైన తులసిమాల పొందుగ వేతునా బంధహితమైన బ్రహ్మానంద మొసగగా ॥మ॥ శ్యామసుందరాంగి నా శ్రమల బాపవా ప్రేమతో పెనుమత్సనివాస బ్రోవవా ॥మ॥ పుడమిలోన పెనుమత్స మహా యోగినీ పడవ దొరికె భవము బాపవిడువ నేలనూ ॥మ॥

కీ ర్త న

మహా యోగినీ ప్రేమించవా మోహాన మురళిగంట మాలకించెదా సరగున కాలజ్ఞానం వినవచ్చితిన్ గురుతించి పరతెంచి ఇచ్చోటికిన్ ॥మ॥ ఆశగొంటినీ నీతోడనే నారచిప్ప గోళ్ళాట ఆడుదమా యోగి బాసచేసి యిటులసల్ప పాటిగాదు పాలింప నీకన్న దిక్కెవ్వరూ యోగి ॥మ॥ నమ్మి

కొంటెని నీతోడనే చెమ్మచెక్కలాడంగ సమ్మతింతువానమ్మ ఒకమాట పడియుంటినీ కల్లగాదు నానుమాట చెల్లనీయుమమ్మా ॥మ॥

కీర్తన

మాయమ్మ మాతల్లి నీవుకూర్చొనబట్టి మదనగోపాలుడు మాకు దక్కెనే మాయమ్మ మాతల్లి నీవు కూర్చొనబట్టి వేణుగోపాలుడు మాకు దక్కెనే మాయమ్మ మాతల్లి నీవు కూర్చొనబట్టి రాగద్వేషాలు రాకేలేదు మాయమ్మ మాతల్లి నీవుకూర్చొనబట్టి అరిషడ్వర్గములు అడగిపోయె ॥మా॥ మాయమ్మ మాతల్లి నీవుకూర్చొనబట్టి కర్మసంచితములు కాలేకపోయె ॥మా॥ మాయమ్మ మాతల్లి నీవుకూర్చొనబట్టి మూడుగుణంబులు మూల దాగె ॥మా॥ మాయమ్మ మాతల్లి నీవుకూర్చొనబట్టి ఈడపింగళ నడుజాడగన్నాము మాయమ్మ మాతల్లి నీవుకూర్చొనబట్టి తోడుబాయక వారిని కూడియున్నాము ॥మా॥ మాయమ్మ మాతల్లినీవుకూర్చొనబట్టి అంతరిక్షమునందు అమరియున్నాము మాయమ్మ మాతల్లి నీవుకూర్చొనబట్టి ఆనందరూపుని ఆత్మగన్నాము మాయమ్మ మాతల్లి నీవుకూర్చొనబట్టి ఏటియావలనున్న సూటిగన్నాము మాయమ్మమాతల్లి నీవుకూర్చొనబట్టి పాటించి గురుబోధ సూటిగన్నాము పెనుమత్స మహాయోగి దాసులైనాము సద్గురుని సేవించి ధన్యులైనాము ॥మా॥

## కీర్తన.

ఎన్నాళ్ళకు నాకన్నుల బడితివి ఇక నిను విడవను మహాయోగి ఎన్నగానునీకన్న నాకు దిక్కెవ రింక నోసదా యోగి ॥ఎ॥ ఆపన్నులగావగ బద్ధకంకణుడవమ్మ మహాయోగి నీదాసుల నేలుట కీర్తిగాదె మహాయోగి ॥ఎ॥ యశము కొరకు వేడితి భావమందున చాలా భద్రముగ నేలరమ్మ మహాయోగివిగావా ॥ఎ॥ ముక్తికొరకు నిను ప్రార్థించితిని ముదముతో గావుము యోగి జ్యేష్ఠ శుద్ధ యేకాదశి శనివారము రాగ ॥ఎ॥ నిను కన్నులజూచు భాగ్యము కలుగజేయవే తల్లి నినుజూచిన కన్నులనే నితరములజూడను నాదండీ ॥ఎ॥ పెనుమత్స మహాయోగి పదములు శిరమున దాల్చెదనమ్మా యీ దాసురాలి భారమదంతా నీదేనమ్మా ॥ఎ॥

## కీర్తన.

నీ మోమాటము మాకు ఏమియులేదు మహాయోగి హృదయం ఖైదినిను జేసితి త్రిపురారివని నిన్ను నమ్మితిని తల్లి తెలిసి బంధించితిని భయమేల మాకు ॥నీ॥ మోక్షమనే లంచమిచ్చి మము బంపకున్న మోసగించి హృదయ ఖైదినిను జేసితి ॥నీ॥ పతితపావనతల్లి వరమివ్వకున్న విడుదలలేదమ్మ ఇక జాగులేల ॥నీ॥ పోలేవు నాతల్లి పోదామనుకొన్న ప్రేమ ప్రాటితో నిను బంధించివేస్తి ॥నీ॥ రాతిగోడలు గావు ఎగిరిపోవుటకు నినుపసంకెలల్ గావు విడిపించుకొను ॥నీ॥ హృదయ కుడ్యము మధ్య ఉంచితిని నాతల్లి ప్రేమసంకెలల

బట్టి బంధించివేసితి ॥నీ॥ జైలుకు కాపలా నేనేను తల్లి గురు తులేని తుపాకి కల్గియుంటిని తల్లి ॥నీ॥ నాపైన యధికారు లింక యున్నారు వారియొద్దకుబోయి విడుదలకోరు ॥నీ॥ ఆఫీసుకు పెద్ద బ్రహ్మయ్యబాబు మహావీరుడు కుటుంబరావు నెరుగవా విజయమొందిన వీరవెంటరత్న మహాగొప్ప వాడండీ గంగాధరరావు ॥నీ॥ శేషమ్మ శక్తియు నీవెరుగ వేమొ మాభక్తులందరు మరిమెచ్చుచుంద్రు ॥నీ॥ ఉన్నారు మాలోన మహావీరులింక మోక్షలంచము నిచ్చి విడుదలగోరు ॥నీ॥ వారి వ్రాలుతోడ ఒక పత్రమునిగి రమ్మి నాదిశకు విడు దలగోర పత్రముండిన నిన్ను నే నమ్మ నమ్మ పుండరీకా క్షులు సాక్ష్యముండాలి సాక్ష్యముండిననాకు దయరాదు తల్లి మోక్షలంచంబివక దయరాదు తల్లి ॥నీ॥ యీ తీరుగాకున్న విడుదలలేదు దయతలచి చెప్పుడీ త్వరపడు తల్లి ॥నీ॥ నీ యబ్బ సొమ్మ లేమోక్షవిత్తమును మాకియ్యవేమి మర్యాదగాను అబ్బతిట్టితినని కోపగించకు తల్లి భవసాగరము దాటలేక నిను తిట్టితి ॥నీ॥ పెనుమత్సవాస నీవు నాయందు వుండా నా కేమి కొదువమ్మ మహాయోగి తల్లి దోసిలొగ్గితినిన్ను దైవమనుచూ తల్లి దాసురాలకు దైవాము నీవె ॥నీ॥

కీర్తన.

పాలించుమని వేడితి శ్రీ మహాయోగినీ పాలింప నీక న్న దిక్కెవ్వరు యోగి దాసులదొరనంటినీ శ్రీ మహాయో గినీ ॥పా॥ శిరమున పడగతో కరమున చక్రముతో అవతరించిన తల్లివీ శ్రీ మహాయోగినీ ॥పా॥ భక్తుల కందరికి భవబంధ

ములు బాప అండనీవని యుంటినీ శ్రీ మహాయోగినీ ॥పా॥ ఏపాపమెరుగము నీపాదము నమ్మితీ ఈ ప్రొద్దున బ్రోవకున్న దాపెవ్వరులేరు మహాయోగినీ చెరుకూరి గురుదేవ కృపజూచి మముబ్రోవ ఇదియేను సమయమునుజాగులేల మహాయోగినీ ॥పా॥ గతిలేని నావంటి మతిహీనులకు నెల్ల గతియు నీవేయుంటివినీ శ్రీ మహాయోగినీ ॥పా॥ పెనుమత్సపురమునందు చిత్రమముగ వెలసిన చిన్నయోగివంటివినీ శ్రీ మహాయోగినీ ॥పా॥

## కీర్తన.

రావా పెనుమత్స మహాయోగితల్లి నీరాక కంతో వేచియుంటిని మోము జూపగరావేమి భక్తులసారథి మహాయోగి బ్రహ్మతనూజ పాలింపకున్న నిందలు పడెదవు యికనైన మహాయోగితల్లి మము బ్రోవకున్న మనజాలను యీ ధరలోన ॥రా॥ అందు ఇందున ఎందును జూచిన అగుపడవైతివి మహాయోగి నీ దర్శన మీయగ రావా మీ దరిజేర్చవదేమి తల్లి ॥రా॥ పరిపరివిధముల ప్రార్థనజేసిన పరాకుజేస్తివి మహాయోగి పరాకుకోర్వక పాపిని నేనై నిందలు జేసితి మహాయోగి నిందలు బాపి నీదయజూపి దర్శనమిచ్చియు దరిజేర్చి కొమ్మా ॥రా॥ లింగాధర ఓ పార్వతీ బంగారుతల్లివి మహాయోగి విష్ణుప్రాణప్రియ మహాయోగితల్లీ నీకై వ్రాసితి మహాయోగితల్లీ ॥రా॥ పెనుమత్సనగరినున్న మహాయోగి దాసురాలను దీవించి కావుము యోగి దీనజనలోచన మహాయోగి ॥రా॥

అనంతరంగము శ్రీవైకుంఠము పెనుమత్సంతా యోగి భజన మేమిర నరుడా జాలము జేసేవు నవ్వులుగాదిది యోగిభజన ॥అ॥ కామక్రోధంబులు ఖండించండీ కడువేగ భజనలు జేయండి ॥అ॥ మూడుగుణంబులు విడువండీ మోక్ష సాధన జేయండి ॥అ॥ చిత్తమునిల్పి భజనలు జేయండి శివుని సన్నిధి జేరండి ॥అ॥ పెనుమత్సమహాయోగి గురువండీ ప్రేమతో నమ్మినామండీ ॥అ॥

కీర్తన

మహాయోగి యతివరా ఇదిగో నీకు జోహారు ప్రీతి తోడ వేగమే అందుకొమ్ము మహాయోగి ॥మ॥ ఎల్లవేళలం దునా కాలజ్ఞానంబువ్రాసి కన్నతల్లి మాకునూ ప్రసాదించివీ ॥మ॥ భవములోన బడితిమీ బాధలందుచుంటిమీ బాప నీవె మేటివీ భయములేదు మాకిక ॥మ॥ రమ్మురమ్ము వేగమే మమ్ముగావ మహాయోగివమ్ముమాకభయమ్ము నీవిమ్ముగాను మహాయోగి ॥మ॥ దైవమనుచు వేరుగా లేదు మాకునిజముగా దైవమైన గురుడవైన అన్ని మాకు నీవెగా ॥మ॥ భక్తజనుల తోడనూ బోధసల్పుచుంటివీ సాటిలేని నీదుకీర్తి వ్యాప్తి జెందెనంతటా ॥మ॥ చైతన్యరూప మాసేన గొనుము హేప్రభో లక్ష్మి పార్వతి రమ్ము అభయమీయగా ॥మ॥ నీదుదాసు లందరూ నిన్నె నమ్మియుండిరి పతితులైనవారి గావ భగ

వంతుడవు నీవెగా ||మ|| లక్ష్మి పార్వతివి నీవెగా దీనులాను బ్రోవవా నీదుపాద సేవకుల గావ సమయ మిదేగా ||మ|| ఏల జాగుసేయకూ ఎంతకాలమింకనూ మాకు మంచిబుద్ధు లొసగి మమ్ము చేకొమ్మికా ||మ|| పెనుమత్సదాసులకు తోడునీడవగుచునూ కరుణతోడగావగా కన్నతల్లివైతివీ ||మ||

కీర్తన.

నమ్మి వచ్చితినమ్మ మహాయోగి నా నమ్మికలేమి జేసితివమ్మ మహాయోగి నా నమ్మికలన్ని మహాయోగి నట్టేటకలిపితివా సదాయోగి ||న|| నీ అభయ హస్తంబుతో మహాయోగి నా శిరమున బెట్టిన ప్రేమలన్ని సదాయోగి ఐక్యంబు జేసికొంటివ మహాయోగి నొక్కమాటైన జెప్పక పోతివి సదాయోగి ||న|| పిచ్చి పిచ్చిపిచ్చంటివి మహాయోగి నీ మృదుమధురవాక్కుతో సదాయోగి రారమ్మంటివి మహాయోగి రహస్యమేమి జెప్పవైతివి సదాయోగి ||న|| గురుసుతుల కంద రకు మహాయోగి గుర్తులేమి జెప్పితివమ్మ మహాయోగి భక్తులందరకు మహాయోగి బట్టబయలు జేసితివమ్మ సదా యోగి ||న|| దిక్కు నీవనుకొంటి మహాయోగి దీనులబ్రోచు దేవుడంటి మహాయోగి దీనురాలను మహాయోగి భిక్షవేతు కొమ్మంటివా సదాయోగి ||న|| పెనుమత్సనగరిలో మహా యోగి చెరుకూరివారిగృహమందు గురుడు ఉన్నాడని మహా యోగి గురుతో : స్తినమ్మ సదాయోగి నాగుర్తులన్నియు మహాయోగి నట్టేట కలిపితివా సదాయోగి ||న||

## మంగళహారతి.

మునివేషధారికి మోహనమూర్తికి వినయవివేకాది వివిధాలంకారికి ॥ము॥ సాధురూపముతోడ సర్వజనులగూడి సర్వముతానని తెల్పినతల్లికి ॥ము॥ గురురూపముదాల్చి పరమ వాత్సల్యంబున పరమార్థంబును తెల్పు పరమపావనికి ॥ము॥ వేదాంతసారంబు వాడలవాడల దిరిగి వెదజల్లభువిలోన వెల సిన తల్లికిపుడూ ॥ము॥ హరినామ కీర్తనమె ఆగమాంత సార మని నిరతము బోధించు పరమపావనికి ॥ము॥ దాసురాలు ఇచ్చె నీకు హారతి సరసనగైకొనుము శాంతముతోడ ॥ము॥ పెనుమత్సమహాయోగి ప్రేమతో ఇచ్చితివి దాసులందరికి దర్శనమివ్వవమ్మ ॥ము॥

## మంగళహారతి.

జయహారతి గైకొనుమా మహాయోగి నే నీ నామ మునే కీర్తనగా పాడెదనమ్మా మహాయోగి మహాయోగి నే నీ నామమునే కీర్తనగా పాడెదనమ్మా ॥జ॥ పెనుమత్స పురముననూ వెలసినావమ్మా వెరపేల యిక మాదరికి వేగమె రావా మహాయోగి మహాయోగి ॥జ॥ విశ్వమంత యెటు జూచిన నీ మహిమేగా కనవా నీదగు నామమునే కీర్తనగా పాడెదనమ్మా మహాయోగి మహాయోగి ॥జ॥ దానిమ్మ ఖర్జూర ద్రాక్షపండ్లారగింపుమా యీ దాసులను కనికరించ వేగమె రావా మహాయోగి మహాయోగి యీ శిష్యులను కనికరించ వేగమెరావా మహాయోగి మహాయోగి ॥జ॥

## జోలపాట

జోలను పాడెద రావా మహాయోగి శ్రీరావమ్మ బ్రహ్మయ్యకుమారి ॥జో॥ పెనుమత్స బృందములోలా నీకు జోలా వేడితి మహాయోగి ॥జో॥ భక్తులు నిను మొరలు బెట్టగ సమాధినుండి బయటకువచ్చి ఆపదలెల్ల బాపి బహుమాపి బ్రోవుమంటి ॥జో॥ భక్తులకు మోక్షమునిచ్చె మహాయోగి నిను నే వేడితిని ముక్తికాంతవంటి బ్రోవుమంటి భయములను యెడబాపుమంటి ॥జో॥ పెనుమత్స మహాయోగి శతవందనములు నే జేసితిని మురళిగానలోలా మొరవినవేలా శరణని వేడితినీ ॥జో॥

## పద్యము.

చేతులార శివునిపూజచేసి యెరుగ భక్తిగలిగి సదాము కుందుని భజన యెరుగ గురుచే గురువుని పూజించియెరుగ పెద్దలకు దణ్ణంబు పెట్టియెరుగ బీదలకు భిక్షంబు పెట్టియెరుగ అన్నదానం బొక్కనాడు చేసియెరుగ వస్త్రహీనునికి వస్త్రంబు లిచ్చియెరుగ ఇట్టి పాపినిబ్రోవ దిక్కునీనె మహాయోగి నన్ను మన్నించవమ్మ.

## పద్యము.

1. సత్యవంతుని భార్యవు సావిత్రివిగాకున్న ఇంత కఠినవ్రతం బెట్లు సాధించితివమ్మ
   నలుని భార్యవు దమయంతివి గాకున్న ఇన్ని కష్టములనెట్లు భరియించితివమ్మ

హరిశ్చంద్రుని భార్యవు చంద్రమతివిగాకున్న ఇంత సత్య
మున కెట్లు ఒడిగట్టితివమ్మ
రామభార్యవు సీతవుకాకున్న ఇంత వ్రతమహాత్యం బెట్లు
కలిగెనమ్మ
అత్రిముని భార్యవు అనసూయవుగాకున్న యింతమహాత్యం
బెట్లు కనుగొంటివమ్మ

2. నీ మహాత్యంబు గొనియాడ తరమానె శేషశాయికైనా
మహి నుద్ధరించుటకు వచ్చిన మహాయోగివిగాకున్న ఇటు
వంటి సాధ్వీమతల్లి ఈ మూడుజగములందు లేదు లేదూ.

3. ఇటువంటి సాధ్వీమతల్లులు లేరు లేరటంచు దిక్కులు
పిక్కటిల్లె
ఇటువంటి సాధ్వీమతల్లులు లేరు లేరటంచు ఆకాశవాణి
బల్కె
ఇటువంటి సాధ్వీమతల్లులు లేరు లేరటంచు భరతమాత
పక్కున నవ్వెన్

4. ఇటువంటి సాధ్వీమతల్లి పెనుమత్స గ్రామమందు చెరు
కూరి గృహమందు శ్రీరావమ్మ బ్రహ్మయ్య దంపతుల
గర్భమందు జనియించితివమ్మ మహాసాధ్వీ నీవు

5. ఆ తల్లిదండ్రుల నోములు ఫలియించె వారి వంశంబు పావన
మయ్యె ఆ పురజనులు నిను జూచు భాగ్యమబ్బె మహా
యోగినీ

మదినీయ నీమీద పద్యములు వ్రాసి మనసుతో సమర్పించితి నమ్మ తప్పులుఒప్పులుగా భావించి దాసురాలను దరిజేర్చు కొనవమ్మా॥

కీ ర్త న.

నీకృష్ణలీలలు నీయద్భుతంబులు అంతుజెప్ప నేను ఎంతదానను తల్లీ ఊహించిచెప్ప ఊహలేదుతల్లీ వర్ణించి చెప్ప నావశముగాదు తల్లి తడికలలోనుండి తళతళ మెరుపులు మెరుపుచాయజూడ మేలిమైతోచె॥నీ॥ ముంగురులు జూడ ముద్దెటదోచె ప్రియముడిజూడ పిలువను మనసాయె॥నీ॥ సూర్యులు మొదలగు . శోభితనారీ పంచరత్నాలవీ పోలినదీ భాస్కరప్రభకన్న మిలియమైనాది॥నీ॥ త్రేతాయుగమునందు నదేవదేవునకు కుబేరుడిచ్చిన పూలవిమానం ఎందరు ఎక్క నలురుకాలీ భూసురులు చెప్పగ బుద్ధితో వింటి కలియుగ మందున పెనుమత్సదాసులకు మహాయోగి నామమె మాకు విమానం భక్తితో గొలిచిన పరమభక్తులకూ ఆశనువదిలితే అంతులేవి కాళీ॥నీ॥ సూర్యచంద్రుల బాట సొంపుగనడచితే సోహంసోహం బను తిక్కటుతీసుక చూపులో రూపమై చుక్కానిబట్టితె వరస తెలుసుకొని ఒదిగికూర్చుంటె విమాన ములో వింతలు జూడొచ్చు॥నీ॥ గోవిందునామమె కొల్లగ జూడొచ్చు శ్రీరామనామమె చిత్రముగజూడొచ్చు రంగని నామమె వింతగజూడొచ్చు మహాయోగి నామమె సుది వింత జూడొచ్చు॥నీ॥ దాసానదాసురాలను తల్లీ పెనుమత్స మహా యోగి శిష్యురాలను తల్లీ॥నీ॥

## కీర్తన.

వింతజేసేవు యోగి సంతమేలనూ పంతము మాని మహాయోగిపాదసేవ నియ్యుమా ॥వి॥ తల్పుచాటునా యోగి తరుణులెవ్వరూ ముక్తికాంతయోగినీవు నిలిచియుంటివా ॥వి॥ రద్దిజేసినా మేము బుద్ధిజెప్పవా రద్దిమాపి బుద్ధిజెప్పి జ్ఞానామృత మొసగవా ॥వి॥ నిర్వికల్ప సమాధిలో నిలచియుంటివా యోగి విష్ణు మహేశ్వరులతో బంతులాడి వచ్చితివా ॥వి॥ పెనుమత్స పురములో దాసుల దొంగవూ ముల్లోకముల కెల్ల కన్నతల్లి వైతివా ॥వి॥

## ఆరగింపుపాట

ఆరగించవమ్మ అమ్మా మహాయోగి వెయ్యారు విధములు తియ్యాని ఫలములు ॥ఆ॥ బీదనైతినాని భేదమెంచకమ్మ కదళి నారికేళ కర్జూరఫలములు ॥ఆ॥ కండచక్కెరతో ఘననిమ్మపండ్లతో నిండువేడుకతో పెనుమత్స పురనివాస ॥ఆ॥ పాయసాన్నముతో పానకం వడపప్పు బాయని నీపాద దాసురాలుదెచ్చె ॥ఆ॥

## ఆరగింపుపాట

ఆరగించవమ్మ మహాయోగి శ్రీకృష్ణునితోను ఆరగించవమ్మ మంచి అరటిపండ్లు చెరుకుపానకం ॥ఆ॥ ఆరగించవమ్మ మహాయోగి శ్రీరామునితోను దోరమామిడి ఫలములు పనసతొనలు తేనెచక్కెర ॥ఆ॥ ఆరగించవమ్మ మహాయోగి

హనుమన్నతో ఊరగాయ చలిది పెరుగు తీరు పులి యోగిర
ములు ||ఆ|| ఆరగించవమ్మ మహా యోగి భక్తులతోను పాలు
మీగడ కండచక్కెర బంగారుగిన్నియలతోడ ||ఆ|| ఆరగించ
వమ్మ మహాయోగి అనుజులతోను దాసమానసావికాస
పెనుమత్స పురవాస నీ ||ఆ|

## కీర్తన.

పెనుమత్స పోవలెనూ మహాయోగిని గనవలెనూ
పెనుమత్స పోవలెనూ స్వాంయోగిని గనవలెనూ ||పె|| మహా
యోగి మహాయోగియనినే మనమున నే తలువగా నెబహోబహో
యనుచునుసగగునవచ్చినతలి కడను ||పె|| చేరుతాలను చేతబూని
చిన్నియోగిన్ని దలచితి జన్మదుఃఖములు రావు జ్ఞాన వైరాగ్యం
బులతోను ||పె|| కరమునా తాంబూరబట్టి ముక్తికాంతను
ముందుబెట్టి మహాయోగిమహా యోగి మహాయోగినిస్మరణలు
జేయుచు ||పె|| పూర్ణయగారి పరిపూర్ణముకోను అప్పయగారి
మహాత్యముతోను మహాయోగి వచ్చె మహాయోగి వచ్చె
యనుచు మహాయోగిని స్మరణలు జేయుచు ||పె||

## కీర్తన.

చతురశ్రజాతి - ఆదితాళము

ఎందుజూచినను ఏకరూపమై వెలుగుచున్నది మహా
యోగి సంశయలేక ఆనందమయుండై సర్వసాక్షియై సర్వము

తానై ॥ఎ॥ నీవు నేనను భేదముకోపక నిలచియున్నది మహా యోగి భావాతీత చిదాకాశంబై పరిపూర్ణంబై పరతత్వంబై ॥ఎ॥ అండబ్రహ్మాండములంతట నిండియున్నది మహా యోగి ఖండమెగాక యఖండరూపమై కర్తయు కర్మయు భోక్తయు తానై ॥ఎ॥ దేహగేహముల మోహమువిడిన తెలివైయున్నది మహాయోగి సోహంకారము నిలకడజేసిన సుజనులపాలిట కల్పభూజమై ॥ఎ॥ శ్రీ గురుకరుణామృతరసము నుసిద్ధమై గును మహాయోగి రాగద్వేషము రహితముజేసిన, రాజయోగులకు చింతామణియై ॥ఎ॥ వాసిమీరార పెనుమత్స సమాధి యందు నిలచియున్నది మహాయోగి గాసిమెరుంగని దాసులకు జ్ఞానసాధులకు మూలము తానె ॥ఎ॥

కీర్తన.

పూజకు రండమ్మా పుణ్యాత్ములారా వారాని కొక దినము వరుసతప్పకుండ పుణ్యఫలముచేత పూజజేతాము॥పూ॥ సద్గురుదేవా పూజ ఆనందమాయె బ్రహ్మానందమాయె ॥పూ॥ తొలి నే జేసిన పూజఫలముచేత నామనస్సు పూజించ మహా యోగి గురుడు దొరకెనమ్మ ॥పూ॥ పాతికయేళ్ళనుండి పడ్డా కష్టాలన్ని భావాభావములందువరకుజేసి బయలుజేసిన మహా యోగి గురువు దొరెకనమ్మ ॥పూ॥ నిద్రహారములేక నివసించి జేసిన యోగభావమంత నా మనసు వైకుంఠస్వామి గురుడు దొరికెనమ్మా ॥పూ॥ ఎంతో మంచి గురుడు దొరికెనే నా మనసున యున్న సంచితములు బాపెనో ॥పూ॥ గురుకు లేడని

గునిసితివి నామనసునందు మహాయోగి గురుడు తాండవమాడుచుండెను ॥పూ॥ చప్పిడి యుప్పిడి లేకుండ నా మనసు సమ్మతముగా పూజించ కలియుగ అవతార మూర్తివై మహాయోగి గురుడుదొరికెనమ్మా ॥పూ॥ అలజడి లేకుండ అంతులేని భావమంతా ఖండనజేసి వ్రాసి కాలజ్ఞానంబును కాలజ్ఞానంబువ్రాసి ఖర్మముల బాపెను మహాయోగి గురువు మెరుకమరుపులేక వేదాంతమంతా పెనుమత్స పురమున వెలసిన మహాయోగి గురుడు వెలసి వేదాంతమంతా వెదజల్లెను మహాయోగి గురుడు ॥పూ॥

కీ ర్త న.

ఎంతో మంచిగురువు దొరికె మోహపాశము ద్రుంచెనే ॥ఎ॥ ఆనందమున మోదమంది భావము బయలు పరచెనూ ॥ఎం॥ చింతమాను పూయువిధము నూటినాలో దెల్పెనే అంతరంగమందు గురుడు ఆటలాడుచుండెనే ॥ఎ॥ ఏడుకొండలకుపైగా ఏకాంతము జూపెనే సాక్షిగా వెల్గేదీక్షలో తాండవమాడుట జూపెనే ॥ఎ॥ గురుతులో చెంగల్వబువ్వులు పూసెవిధము జూపెనే గురుతువిడిచి పైగానున్న ఆవల తత్వము పొందుమానెనే ॥ఎ॥ భేదభావము విడదీసి తనలో ధీరతగా నుండుమనెనే మహాయోగి గురువుజెప్పగ సుబ్బమాంబ వినెనే ॥ఎ॥

కీ ర్త న.

ఎటుబోతివో మహాయోగి యిటురావ మహాయోగి మటుమాయ చేయుదగునా మహాయోగినీవు నన్ను ॥ఎ॥

ముచ్చటలాడవేమి ముద్దుయోగి జూపరావ ముల్లోకముల కెల్ల కన్నతల్లివైనావు ॥ఎ॥ పాపరహిత మహాయోగి పాలింప రావనన్ను వెతలు బెట్టెదవేల వేగమె నన్నుబ్రోవ ॥ఎ॥ నాదారి జూపరావా నిరుపేదరాలను తల్లీ నిత్యము నన్ను బ్రోవ నీ కింత భారమ యోగి ॥ఎ॥ ఎక్కడనుంటివమ్మ ఎందులదాగితివమ్మ దయతోడ బ్రోవవేమి పెనుమత్సనివాస యోగి ॥ఎ॥ సంసారాంబుధి దాటి దరిగానలేను తల్లీ మాయల నెల్ల ద్రుంచి మన్నించు మహాయోగి ॥ఎ॥ దాసురాలు మొర విని గ్రొబ్బునబ్రోవలేవా దీనపోషక యోగి దీనురాలినిగావుము తల్లీ ॥ఎ॥ శ్రీరావమ్మ జననీ దాసులను గావవేగా దాసురాల గాన నీకు దయతో బ్రోవుముతల్లి ॥ఎ॥ కలికాలమానవులకు కర్మంబు బాపుటకు పెనుమత్సపురములో ప్రేమలో వెలసిన యోగి ॥ఎ॥

## కీర్తన.

పద్యములు గావమ్మ పణతులారా యివి తత్వాలు గావమ్మ తరుణులారా యివి కాగితాలు కావమ్మ కాంత లారా ఇవి ॥ప॥ అమృతమనే సిరా ఆదిలో దీసి దయయన్న కలమును ధరణిలో పట్టి వి త్తనంబులుజల్లెమహాయోగి తల్లి వీధులంతా దిరిగి వి త్తనంబులు వెదజల్లి వీసువారని భేద మెంచక సందుగొందులు తిరిగి సాంతముజల్లి కరుణించిజల్లెనే కళ్యాణియోగి కృపగల్గిజల్లెనే భూజాతయోగి వి త్తనంబులో వున్న బీజఫలమేమొ ఒకరికి తప్పులై తోచు మరిఒకరికి తాళై తోచు అవి త్తములు ఏరేటి సత్తువయుంటె ఏకాంత స్తలమున

వరొచ్చు విత్తనంబులు ॥ప॥ అది అంతులేనిగాదె కేతుకొని పంచకోశములతో పడికట్టు విత్తనములు సూర్యచంద్రులనే జోడెద్దులగట్టి భక్తిజ్ఞానమనే పగ్గముబట్టి ఛోఛోయనే సోహ మను నూహతో మడియనే మనసును మరివేగదున్ని ఆశ యనే నీరు అందముగబెట్టి కోర్కెలేకను గట్టు కొమరొప్ప బెట్టి పంచతన్మాత్రలు మొలకలయి మొలిచి పంచరంగుల తోడ ప్రజ్వరిల్లెను పైరు ॥ప॥ యోగాగ్ని చేతను పంట పండించి పండినపంటను పదిలంబుజేయుట యోగికిగాని నా కేమి తెలి యదు మహాయోగిజల్లిన విత్తనంబులు విత్తనంబులు వరుకవృద్ధి జెందుడీ అర్థంబు జెప్పుమని అడుగు త్రిపురాంబ మాటిమాటి కడుగు మగువ రత్నాయమ్మ అర్థంబుఎట్టిదో అంతు తెలియక శ్రవణ శాంతిలేక చెడిపోతినమ్మ యోగమంటే యెట్టిదో మొదలు తెలియక తల్లడిల్లుచుంటిని తల్లి నేను సాంఖ్యతారక మెట్టిదో సాధనతెలియక అమనస్క మెట్టిదో అంతు తెలియక భక్తిజ్ఞానములేక పాడైపోతి ॥ప॥ దారి తెలియకనీదరి జేరితినమ్మ తప్పులున్నను ఒప్పులుగా భావించి అపస్వరాలున్న ఆదరించు తల్లీ అంకితము బెట్టుటకు ఆజ్ఞ లేకను త్రిపురాంబజేసెను యీ తీరునన్ను దాసానుదాసులకు దాసురాలని తల్లీ పెనుమత్స మహాయోగి శిష్యురాలను తల్లీ ॥ప॥

కీర్తన

గురు కరుణామృతసారము గ్రోలుట పరమభాగ్యమె ఓమనసా ॥గు॥ గురుపద సేవలు మరువక జేసిన నరకములేదే ఓమనసా ॥గు॥ పుట్టిగిట్టి మరి గర్భనరకము కొట్టుకొనుట

యేటికి ఓమనసా పట్టువిడువక అరిషడ్వర్గంబులు మట్టుమాపవే ఓమనసా ॥గు॥ చాలుచాలు ఇహపరసౌఖ్యంబులు ప్రాలుమాలకే ఓమనసా మూలమైన యానందపదవిలో నోలలాడవే ఓమనసా ॥గు॥ ఈడపింగళ సుషమ్నమధ్యను జూడగాంచవే ఓమనసా కడానితీగెలవంటి చిత్కళలగాంచి మించవే ఓమనసా ॥గు॥ నీవు నేనను భేదములెల్లను బోవగనవే ఓమనసా నీవే నేనను సత్యార్థంబును నిల్కడగనవే ఓమనసా ధాతృధ్యానగేయమునందలి సూత్రము గనవే ఓమనసా సూత్రమెరిగిన యోగికి మోక్షముసులభంబగునే ఓమనసా ॥గు॥ వాసిమీర వెనుమత్స మహాయోగి శిష్యురాలను ఓమనసా వాసియెఱుంగని దాసురాలకు మోసము జేయకే ఓమనసా ॥గు॥

కీర్తన.

సోహం సోహం సోహంబనవే ఓమనసా సోహం బనుచును నీ మదిలో సాధనజేయవె ఓమనసా సోహముకంటెను మించిన సాధన మేమియు లేదే ఓమనసా ॥సో॥ శాస్త్రంబులు బహు చూచుచు కాలము పాడుజేయకే ఓమనసా శాస్త్రసారమని చెప్పె మహాయోగి సోహమంత్రమే ఓమనసా ॥సో॥ సోహమంత్రభావముచే నీవు చిన్ముద్రపట్టవే ఓమనసా చిన్ముద్రపట్టి దేహము మరచి శ్వాసను నిలుపవె ఓమనసా శ్వాసను నిల్పి ఓంకారంబు ఒనరుగ వినవే ఓమనసా ॥సో॥ ఓంకారంబునునిల్పి నీయాత్మమహిమ నాల్గుశబ్దములు మురిపెముగా వినవే ఓమనసా ॥సో॥ దశవిధనాదములకని నీవు సాధనజేయవే ఓమనసా సాధనజేసి శోధనబూని సద్గతినొందవె

ఓమనసా ॥సో॥ ధరణి పెనుమత్స మహాయోగిని గురువని నమ్మవె ఓమనసా గురువని నమ్మి గుర్తునిలిపి దీనిగుట్టు తెలుపునే ఓమనసా ॥సో॥

సె ల వు పా ట

శెలవా శ్రీ మహాయోగి మాకు శెలవా శ్రీ సదాయోగి మాకు శెలవొసంగు మిక సేవకజనులము హృదయములో నీనామము దలచెద॥ శె॥ ప్రొద్దుపోయె నిక నిద్రవేళాయె పవళించవమ్మా మహాయోగి మాకు ॥శె॥ శయ్యపైన నర మాత్మని గూడుక బుజ్జగించవమ్మా మహాయోగి ॥శె॥ దాసులగు ఈ పామర జనులకు దారిజూపించియు వేగమే ॥శె॥ దాస దాసనాలరత్న వెంకటదాసార్చిత మహాయోగి ॥శె॥

కీ ర్త న

మహాయోగి భజనకు మీరు రయముతోను రారమ్మ ప్రేమతో భజనలు చేసినంతనే మహాయోగి మనలను రక్షించున్ ॥ను॥ మహాయోగి హస్తము సోకినంతనే దాసురాలు పాపముపోలేదా, మహాతకులంతా గూడి భక్తితో జేసిన హరించున్ ॥మ॥ దాసుల భక్తికి మెచ్చియు వేగ దర్శనము జూపించును రాత్రియందున దర్శనమిచ్చి భక్తులనందరి కడ తేర్చును ॥ము॥ కలికాలమానవుల కర్మంబు బాపుటకు విష్ణు మహేశ్వరులే వీడొ్కలిపే మహాయోకన్ ॥మ॥

కీ ర్త న.

ఏమమ్మా మహాయోగి పెనుమత్సనివారస ఏమమ్మా సదాయోగి పెనుమత్సనివాస ఏమమ్మా మహాయోగి ఏమి

సొమ్ములేకపోయె శిరమునపడుగెంతో చిత్రమాయె మహా యోగి ॥ఏ॥ వెర్రిదానవైన కావు ఎంతో దనము కలదు నీకు కరమున చక్రముండుట కారణమేమొ యోగి ॥ఏ॥ రాణి వాసమువలె నీకు రాజసంబులు గలవు తల్లి వస్త్రములేక యుండుట వబ్బిడేమొ యోగి నీకు ॥ఏ॥ మానాభిమానములు చాలకలవు యోగి నీకు భక్తహృదయమందు పవళించు టెందుకో ॥ఏ॥ తల్లిదండ్రి అన్నిదమ్ము లక్క చెల్లెలుండగాను. పోయిపోయి పరమాత్మ చెంత చేరు టెంకులకో ॥ఏ॥ అంద మైన భవనంబులు అన్ని కలిగియుండగాను తడికెల సమాధిలో యుండుట ధర్మమేమొ తల్లినీకు ॥ఏ॥ పంచభక్ష్య పరమాన్నంబులు చాల కలిగియుండగాను అన్నహారంబులు మాని అలసిపోవు టెందులకో మహా యోగి ॥ఏ॥ కాంచనార వంబులైన కరువులేదు నీకు యోగి తెల్లవస్త్రం బెంత తేలి కాయె తల్లి నీకు కాలమృత్యువు గర్వమణచి భక్తులబ్రోవలేదె పామరులకు నీవు పరుగులిడు టెందులకో. యోగి ॥ఏ॥ దిక్కునీ వటంచు నమ్మి యోగ మెప్పుడు చేయనైతి. ఒక్క ప్రాణా యామమైన చేయనైతి మహా యోగి ॥ఏ॥ హనుమత్సదాసు రాలు ప్రేమతో నిన్ను వేడ ఆదరించి బ్రోవకుండుట అన్యాయ మొ మహా యోగి ॥ఏ॥

కీ ర్త న

యోగినామామృతమె మనసా పాన మెప్పుడు జేయుమా గురుడొక్కడె యనుచు మదిలో తెలిసి ధ్యానము జేయుమా ॥యో॥ నీచవృత్తులు మాని శ్రీయోగి కలుషమును హరియిం

చుమా యోచనంబులు తెలిసి, యోగినిజూచి ఆనందించుమా ॥యో॥ నిక్కముగ శ్రీ గురుని మదిలోనమ్మి పూజలు జేయుమా మహా యోగినితో సంతేరనిజగతిలోపల దెల్పుమా ॥యో॥ శ్రీ యోగికి పరిమళము గల పన్నీటిని జలక మార్చుమా మెత్తనైనా చీని చినాంబరములతో కురులొత్తుమా ॥యో॥ పట్టుపీతాంబరములు బ్రహ్మపుత్రి కర్పణ జేయుమా పట్టుపిడువక ముక్తికాంతను గట్టిగా వలపోయుమా ॥యో॥ చందనకర్పూర పరిమళగంధము మోలదుమా మేలుగా కస్తూరి తిలకము ఫాలమందున దిద్దుమా ॥యో॥ మల్లెలు మరిజాజి మరువము ఎల్ల వేళలలోయుమా యుల్లమున శ్రీ యోగిపై కొల్లగ విరజల్లుమా ॥యో॥ చారుతన యజ్ఞోపవీతము పరయోగి కివ్వుమా ముక్తి కాంతకు మంత్ర పుష్ప సమర్పణ జేయుమా ॥యో॥ శ్రీకరంబుగ దధిపాయ స్నానంబులు ఆరగింపులు జేయుమా నారికేళ కర్పూర నీరాంజనము సమర్పించుమా ॥యో. వాసిగా పెనుమత్సనమామధియందున్న గురుడూ కరుణతో దాసురాలిని కాపాడిన మహా యోగిని ॥యో॥

## కీర్తన

దరిశనమీయుమా బ్రహ్మతనూజ మాకు దరిశన మీయుమా మహా యోగినీ బాల్యప్రాయమునందే చాలగా వేడితి కాలుని వలలోన పాలవసేయక ॥ద॥ అప్పుడు నీమాయచే అన్నియు మరచి కష్టముపుత్తుకట్టి తపనజెందెడి వేళ ॥ద॥ దూరముగా యమమాతలను చూచి తారుమారై తల్లడిల్లెడి

వేళ ||ద|| ధరణి యీ దాసురాలిని బ్రోచియు కరుణతో రక్షించు మరణకాలమునందు ||ద||

## లాలిపాట

లాలి శ్రీ గురుబ్రహ్మా లాలూగనమ్మ లాలి శ్రీ మహాయోగి తల్లి కోయమ్మా ||లా|| క్షుత్పిపాసలను ఎట్లు ఓర్చినావో నిండు సమాధిలో ఎట్లుండినావో ప్రపంచ భ్రాంతులను ఎట్లు మరచినావో బాలచంద్రునిరీతి ప్రబలు చుంటివి ||లా|| ఎంకుజూచిన మరి సందులేక నిండియున్న మహాయోగి తల్లి సోహంసోహం బను మంత్రము సొంపుగాను విరజల్లె మహాయోగి రాజయోగులకు ||లా|| ఆపరోక్షజ్ఞానమున ఆనందముపొంది వసుసగా భూమి మధ్య చోద్యంబు నెరిగి త్రివేణిసంగములో స్నానంబులాడి విష్ణు మహేశ్వరులతో ముచ్చటలాడి ||లా|| ధరలోన పెనుమత్సపుర మందున మహాయోగి గురుని భక్తులందరూ అక్షయ మను చునుదీవించగానుమహాయోగితల్లినీ పట్టి తొట్టూపరమా ||లా||

## జోలపాట..

జో సచ్చిదానంద జో ఆత్మానందా జో సద్గురులీల జో భక్తపాల అక్షరములతొట్టి అమరియుండంగా శేషుడు చెలరేగి ఆడుచుండంగా ముక్తి కాంతామణి జోహారులివ్వ ముదమొప్ప పూజ్యాలు పూజించుచుండ ||జో|| కుండలి స్నానంబు కూడుండగాను ఉచ్ఛ్వాస నిశ్వాస పాన్పునందున ఊర్ధ్వముఖమున రేగి ఎదురాడగాను మానసికమునందు ప్రార్థ

నలుజేయ ॥జో॥ దివి దేవతాంగనలు పాటలు బాడ పుష్ప వర్షము గురిసె పూర్ణంబుగాను షోడశకళలతో వీక్షింపు చుండ చోద్యముగ మహాయోగి వచ్చి నిలువంగా ॥జో॥ క్షేత్రజ్ఞుడవనుచును చెలరేగిపాడ భక్తులంతాగూడి హారతు లివ్వ అంబరవీధిలో నాట్యంబులాడ పరమసంభ్రమున పాటలుపాడ ॥జో॥ ధరలోన పెనుమత్స పురమునందున పుణ్యులందరుగూడి పూజలనుజేయ మహాయోగి గురుని చెంతజేరి నాసురాలుపల్కె దైవమనుచునూ ॥జో॥

మేలుకొలుపు

మేలుకొనుమా మేలుకొనుమా మహాయోగి తల్లి మెలుకొనుమా మేలుకొనుమా మెలుకొనుమా సదాయోగి తల్లి మేలుకొనుమా ॥మే॥ శిష్యులందరుగూడి నీవర్ణనము నకు చేరి భజియింపుచుండిరి మేలుకొనుమా ॥మే॥ యోగ నిద్రలో నిలచితివి నీకైమేము లేచితిమిా ఈభక్తితో ప్రార్థన చేయుచుంటిమి ॥మే॥ పళ్ళెరములో ఫలహారములే ఎదురు చూచుచున్నవిగా ఆరగించి మా ఆశ దీర్చు ॥మే॥ నివమాని మాభక్తివిని ఏలరావు మా గురుస్వామి నియమముతో నీవు జేసితి ॥మే॥ అవనియందు అవతారుడవై వెలసి తల్లి దాసులకోర్కె దీర్చుమంటిమి మేలుకొనుమా ॥మే॥

కీ ర్త న.

గురు కటాక్షము కల్గెనోయమ్మ మహాయోగి తల్లికి గురుకటాక్షము కల్గెనోయమ్మ గురుకటాక్షము కలుటను బహు తొలిజేసినపూజఫలము పరముజేరవలెనంటే ఇదేత్రోవ

గనరమ్మా ॥గు॥ విజయనామ సంవత్సరమందు మహాయోగిని జూడ వీధివీధులు నిండెనోయమ్మ పిచ్చిపిచ్చి యనుచు దెల్పు పిచ్చియనుచు దెల్పు తెల్పు తల్లి ॥గు॥ పిచ్చిమాటలె యమృతగుటకని ప్రేమతో నమ్మినవారికి మోక్షమునకు త్రోవజూపు ముక్తికాంత మహాయోగి ॥గు॥ తాలనామకుట మేరగాదమ్మ మీలో మీకు గురుతుపరచి చదువులో యమ్మ మూడు మొనల కొండనడుమ ముక్తిచేరు పుషముదెల్పి మొనక మరుపులు గుర్తుపరచి యేకమై పోయెటందుకు ॥గు॥ ఆరుచక్రములు నిండెనోయమ్మ నీలోనున్న హంసతిరుగువిధము తెలియవమ్మా తెట్ట తెరువు బట్టబయలు తేటతెలివి గుట్టుతెలిసి లోపలనడుమ వెలిగే పరంజ్యోతిని జూచుటకు ॥గు॥ పెను మత్స్య పురములోనమ్మా మహాయోగి భక్తులనుజూడగా నోయమ్మ సూటిదెల్పిన మహాయోగి చిన్నయాత్మగాంచి మెలగి సుబ్బమాంబనుకూడి పాడి గురుతుతప్పక నిలుచుటకు ॥గు॥ సంకల్పములు సమసెనోయమ్మ మహాయోగిని జూడ వింతమనసు మారెనోయమ్మా అంతులేని ఆనందమొంది వనరుగా నడినాళమందు రెంటిమధ్య వెల్గుచున్న జ్యోతి రూపుగాంచుటకు ॥గు॥

## మంగళహారతి.

మంగళమని మంగళమని మంగళమనరే మంగళమని పాడరే మహాయోగి గురునకూ ॥మం॥ తారకంబు సిద్ధి తెల్పు శైవగురునకూ పరమార్థ మంత్రము తెల్పు పరమగురునకూ ॥మం॥ పంచవన్నెలలందు వున్న దండిగురునకూ కంఠలాగ్రమందు

వెల్లు దండిగురునకూ ॥మ॥ సచరాచరములందు సాక్షి గురు
నకూ అచలభావమందున్నను అమరగురునకూ ॥మ॥ జగా
జగములు వెల్గు జగద్గురునకూ యుగాయుగము లుండు
లుండువరకుండు గురునకూ ॥మ॥ వాసిగా పెనుమత్స వాస గురు
నకూ శాసురముగ దేశికేంద్ర గురునకూ ॥మ॥ యీశామహేశా
మహాయోగి గురునకూ ధ్యానమునుమని దాసులధ్యాన గురు
నకూ ॥మ॥

## కీర్తన.

పెనుమత్స మహాయోగి నీకు నిజరూపములు జూప
వమ్మా నీరేజదళనేత్రి నిత్యపూజలు నీకు మనసందుజేసెదమన
విఘ్నకొనుతల్లి ॥పె॥ యెల్లజగంబుల కెల్ల కన్నతల్లి వలెను బ్రోచి
నావని యుల్లమందున నమ్మియుంటిని కల్లగాదిది మహాయోగి
తల్లి ॥పె॥ పెనుమత్సపురమందూ నిన్నుకోరి భూసించితి ముందు
ముందు జనమలెల్ల ఘనముగ నీచుట్టు నీవాక్యామృతము గ్రోల
నిన్ను ఆశించేరు మనము మరియొగ్గు సేయక వినయముతో
వారందరికి తమవృత్తో కైలాసపురమున వసముగ సెలవియ్య
వమ్మా ॥పె॥ బంగారుబొమ్మనమ్మా నిన్ను శృంగారించగ
జూసి మమ్మ శ్రీతులసిహారములు ముదముతో మెడవేసి
అత్యంత తెల్లవస్త్రము మంగళముజుట్టి ప్రేమతో తల్లి దండ్రి
చెరువందేయుండగాను భక్తులకు బోధచెల్పు తల్లి ॥పె॥
భక్తుదారవినావు దాసుల మొరవినవెందుకూ ధనముకోస
మనీ నామమమున నెంచగలేను మహాయోగి నీ కరుణకొరకు
బోయెనో యిల కమ్మలప్పన గురునిచే వలయు బలముతోడ

వేగమె కలలో వారి కనవచ్చినటు తడయకను దయచేయవమ్మ
||పె|| పెనుమత్స మహాయోగి మమ్ము చేపట్టి రక్షించుతల్లి
ఈపట్ల మముగావు ఆదిస్వరూపిణి బ్రహ్మయ్యపుత్రీ మహిత
గుణవల్లి భేదమెంచనువలదు నాపై తప్పులనుక్షమియింపుతల్లి
కన్న బిడ్డలవలెను మమ్ముకరుణతో తాపాడుతల్లి ||పె||

## సద్గురుమాత

శ్రీయోగి జయయోగి సోహం శృంగారయోగి మహా యోగి జయయోగి నామనసు నమ్మినయోగి ||శ్రీ|| అఖిలాం బరమునినాయక ఆవాహన మిదో యోగి నీకు అఖిలలోకరక్షకా సింహాసన మిదో యోగి నీకు ||శ్రీ|| పాతకసంహారణా పాద్య మిదో పాదములకు అఖిలలోకరక్షకా అర్ఘ్యమిదో హస్తము లకు ||శ్రీ|| ఆదిమధ్యాంతరహిత ఆచమనంబిదో నీకు మధు సూదన మదనజనక మధుపర్కం బిదో నీకు ||శ్రీ|| సతతదీన మందార స్నానమునకు జలంబిదో వ్రతఫల సందాన్యల వస్త్ర యుగళంబిదో నీకు ||శ్రీ|| యతిమునీంద్ర దేవవంద్య నీకు యజ్ఞో పవీతంబిదో నీకు చతనా జనక దేవ చందనంబిదో నీకు ||శ్రీ|| పూతచరిత పురుషోత్తమ పుష్పదామ మిదో నీకు అతిదయా కర పతితపావన అగరుధూపం బిదో నీకు ||శ్రీ|| కరుణాకర సుగు ణధామ కర్పూరదీపం బిదో నీకు నరమృగ యవతారధీర నైవేద్యం బిదో నీకు ||శ్రీ|| ధారుణిదారిద్ర్యాపహార తాంబూల మిదో నీకు నీరాజాజిసనాజవినుత నీరాంజన మిదో నీకు ||శ్రీ|| మారకోటసుందరాంగ మంత్రపుష్ప మిదో నీకు కలియుగ

భజనకీర్తనలు

యవతారయోగి ప్రదక్షిణ మదో యోగి ||శ్రీ|| పెనుమత్సపుర నివాసయోగి ఉపచారములనుస్వీకరించి ధ్యానమరువనిదాసు రాలకు కరుణతోడను కైవల్య మిమ్ము మహాయోగి ||శ్రీ||



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA126B164 |
| పుస్తకం పేరు | భజనకీర్తనలు |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 57 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | C.I ,bci ,6,36b |
| లేని పేజీలు | 1 to 4 |
| తయారు చేసినది | P. Jagamma |
| పేజీలు విడదీసినది | P. Jagamma |
| స్కాన్ చేసినది | Pravallika |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |